

# మహాత్మా గాంధీ స్మృతి సంచిక.



బాపట్ల స్త్రీ హితైషిణీ మండలి ప్రచురణ.

---

ప్రథమ ముద్రణము



మూల్యము 0-4-0

# విషయ సూచిక.







# మహాత్మా గాంధీ




శ్రీమతి కొండూరు అన్నపూర్ణమ్మ

చిత్రకారిణి - బాపట్ల.

---

" గాంధీజీ - స్మృతిసంచిక "

సంపాదకురాలు : శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ.

ఈ స్మృతి సంచికలు వలయువారు :—

సెక్రటరీ, స్త్రీ హితైషిణీమండలి, బాపట్ల,

అని వ్రాయవలయును.

# వందే మాతరం



వందే మాతరం :

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం, వందే మాతరం.
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం, వందే మాతరం.
త్రింశత్కోటి కంఠ కలకల నినాద కరాళే
ద్వాత్రింశత్కోటి భుజైర్ధృత ఖరకరవాలే
కథముంతి జనాస్త్వాం కథం మాత రబలాం
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదల వారిణీం మాతరం, వందే మాతరం.

త్వం హి విద్యా త్వం హి ధర్మః
త్వం హృది త్వం హి మర్మః,
త్వం హి ప్రాణాః శరీరే
బాహౌ తే తుమి మా శక్తిత్వో మర
ప్రతిమానిషి మ నసి మ నసే, వందే మాతరం.
త్వం హి దుర్గా దశ ప్రహరణ ధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ నమామి త్వాం, వందే మాతరం.
నమామి కమలాం అమలాం అతులాం
సుజలాం సుఫలాం మాతరం,
శ్యామలాం సరళాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం, వందే మాతరం.

— బంకించంద్ర ఛటర్జీ.

వైలాన్ ప్రింటింగువర్క్సులో ముద్రితము, గుంటూరు. 500 కాపీలు.

# తొలి మాట



జగత్పూజ్యుడగు బాపూజీ అదృశ్యులైనందులకు కంట తడి పెట్టనివారు లేరుగదా! "ఉడుతకు ఉడుతాభక్తి" యనునట్లు మా స్త్రీహితైషిణీ మండలియు మహాత్ముని నిర్యాణ సందర్భమున సంతాప సూచకములగు కార్యక్రమము లన్నియు జరిపి కడపట ఆయన ఆత్మ శాంతికై పేదల కన్నదానముచేయ సంకల్పించుకొనెను. ఇందులకు బాపట్ల స్త్రీలోకము ఉత్సాహముతో పూనుకొని శక్త్యనుసారము తోడ్పడినది. ఈ సందర్భమున వసూలైన సొమ్ములో అన్నదానమునకు పోగా కొంత మిగిలెను. ఆ మిగిలిన సొమ్మును మండలి సొమ్ములో చేర్చుటకంటె మహాత్ముని స్మృతిచిహ్నముగా పొత్తము నొకదానిని ప్రకటించి విరాళదాతలకు నొసంగుట యుచితమని నిశ్చయించితిమి. కొఱవడిన సొమ్మును మండలి నిధినుండి యొసంగుటకు నిశ్చయించితిమి! మహాత్మాగాంధీ స్మృతి సంచిక యను పేరుతో నీ పుస్తకమును ప్రచురించి మహాత్మునియందు మా భక్తియు దాతలయెడ మా కృతజ్ఞతను తెలుప నుద్దేశించితిమి. ఈ మా ప్రయత్నమునకు తోడ్పడి సంచికకు తమ రచనల నొసంగిన రచయిత్రులకు మా మండలిపక్షమున కృతజ్ఞతా పూర్వకాభివందనములు తెలియజేయుచున్నాము. ఇది మా ప్రథమ ప్రయత్నమగుటచే నిందలి లోపముల మన్నించి యీ సంచికను సాదరదృష్టితో తిలకింప పాఠకులను ప్రార్థించుచున్నాము.

స్త్రీహితైషిణీమండలి,
బాపట్ల.
ఆగష్టు 17, 1948.

ఇట్లు,
ఇమ్మానేని సీతాదేవి,
కార్యదర్శిరాలు.

# ప్రార్థన

పరమాత్మా! నీ అనుగ్రహాతిశయమును మే మెట్లు కొనియాడ గలము! ఎందరో జ్ఞానసంపన్నులను, భక్తపుంగవులను, త్యాగనిరతులను, సేవాపరాయణులను సద్వర్తనాశీలురను మా కాదర్శప్రాయులనుగ ఈ భారత వర్షమునం దుద్భవింప జేయుచున్నావు. ఉజ్జ్వల నక్షత్రములవలె వారి దివ్యచారిత్రములు మాయెట్టయెదుట ప్రకాశించుచు నడువవలసిన మార్గమును మాకు ద్యోతకము చేయుచున్నవి. కాని మార్గము తెలిసిన నేమయ్యెను? స్వార్థ సుఖాభిలాషులమై అహంకార మమకారపీడితులమై మహాపురుషులద్వారా నీవు చూపుచున్న పథమున పయనింపజాలక వెనుకబడి పోవుచున్నాము. దయాసింధూ! అగ్రసోదరులనుగ నీవు మాకు ప్రసాదించిన ఆ మహాత్ముల అడుగుజాడలలో మేమును నడచి ధన్యాత్ముల మగునట్లు కటాక్షింపుము. పరమేశ్వరా! ఇవే మా నమోవాకములు.

ఓం శాంతిః శాంతిః శాంతిః



# అంజలి.



దేశజనని దాస్య దీనత్వమును బాప
　　విహగేంద్రు డయ్యెనే వీరవరుడు
అనుగుసోదరుల మహార్తి నున్మూలింప
　　వామనుండయ్యెనే ప్రేమమయుడు
పేదల దారిద్ర్యపీడను భంజింప
　　చక్రంబు దాల్చెనే శౌర్యమూర్తి
అడగారి యున్నట్టి యస్పృశ్యజాతుల
　　హరిజను లైసె నే యనఘయశుడు

సత్య మెవ్వాని జీవితసార మయ్యె
హింస నెవ్వడు సర్వదా నేవగించె
నట్టి మహనీయమూర్తి మహాత్మగాంధి
చరణయుగళికి మా నమస్కారశతము.

* * *

# మహిళోద్ధరణ.



అహింసాత్మక జీవిత విధానంలో తన భవిష్యత్తును తాను దిద్దుకోడానికి పురుషుడి కెంత హక్కున్నదో స్త్రీకిని అంతే హక్కు వున్నది. కాన స్త్రీ పురుషులు పరస్పరాంగీకారంతో సహకారంతో సమాజ ప్రవర్తనా నిబంధనలను ఏర్పాటు చేసుకోవలయును. మహిళోద్ధరణ కార్యక్రమమును సాగించుట కాంగ్రెసువారికి లభ్యమైన మహాభాగ్యములలో నొకటి. భార్యలను, భర్తలు గౌరవనీయులైన ఆత్మీయులైన సహచారిణులుగా భావించవలెను.

మహాత్మా గాంధి.

స్వరాజ్య ప్రణాళికా సూత్రము 9

# 1947 ఆగష్టు 15 స్వాతంత్ర్యోత్సవములో మహాత్ముని ప్రశంస.



దారుణ మారణాస్త్రములు దండిగ కల్పనజేసి క్రూరతన్
బోరిన హిట్లరే తుదకు పోడిమి దక్కి నశించి పోవగా
మూరెడుకర్ర చేగొనకె మోహనదాసు మహాత్మగాంధి చే
కూరిచె రాజ్యలక్ష్మి నహ కూర్మిని చిత్రము దైవకృత్యముల్. ౧

"ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధముం గైకొన్న చందంబునన్"
తగవుం సత్య మతిక్రమింపకనె ధౌర్త్యంబేమి లేకుండనే
పగరం గెల్చి స్వరాజ్యమం సుధను సంపాదించి మా గాంధిజీ
వగపుం బాపెను భారతాంబ కిక వహ్వా చూడు డీనాటితో. ౨

వెఱ్ఱివాడు గాంధి వింతైన ధర్మాలు
చిలుకవోలె సతము పలుకుచుండు
నమ్ముచుండ్రు ప్రజలు నలుబదికోటులు
అతనికంటె వెడగులౌరవీరు. 3

అనుచు నవ్విన లోకమే నౌర యిపుడు
భరతమాత స్వాతంత్ర్యంబు బడయు టరసి
విస్మయానంద కలితమై వినయ మెసగ
ప్రణతు లిడుగాదె మా గాంధి ప్రతిభ నెంచి. ౪

A. I. R. అనుమతితో.



# మహాత్మాగాంధీ జీవిత సంగ్రహము.



1869 సంవత్సరం అక్టోబరు రెండవతేదీ భారతవర్షానికి మహా శుభదినం. ఆనాడు మహాత్మాగాంధి జన్మించాడు. ఆయన జన్మ స్థలము పోరుబందరు. ఆయన పూర్తిపేరు మోహనదాసు కరంచంద్ గాంధి. గాంధి తల్లి పుత్తలీబాయి. తండ్రి కరంచంద్. భార్య కస్తూరి బాయి. కొమారులు హీరాలాల్, మణిలాల్, రామదాసు దేవదాసు వీరు గుజరాతి వైశ్యులు. గాంధి అనునది వీరి యింటిపేరు.

గాంధి యిగ్లండువెళ్లి బారిష్టరు పరీక్ష ప్యాసై వచ్చి మొదట బొంబాయిలోను పిమ్మట రాజకోటలోను తరువాత దక్షిణాఫ్రికా లోను బారిష్టరుగ పనిచేశాడు! మహాత్మాగాంధి చిన్నతనంనుండీ నియమ నిష్ఠలు గలవాడు; సత్యవ్రతుడు; అహింసా నిరతుడు; భగద్భ క్తుడు; రామనామ ప్రియుడు; సత్యాన్వేషణ ఆత్మపరిశోధన, ఇంద్రియ నిగ్రహం క్షమాశీలత ఆయనకు వెన్నతోబెట్టినగుణాలు.మహాత్మాగాంధి సీమకు వెళ్లుతున్నప్పుడు తల్లివద్ద మద్యమాంసములు ముట్టననీ, పర స్త్రీని అంటననీ ప్రమాణముచేసి అది త్రికరణశుద్ధిగా పాలించాడు. తన మాతృభూమి పరదేశస్థుల పాలనలో ఉండటం హేయమనే భావం ఆయనకు చిన్నతనంలోనే కలిగింది. స్వాతంత్ర్య వాతావరణపూరిత మైన పాశ్చాత్యదేశనివాసం ఆ భావాన్ని మరికొంత బలపరచింది. దక్షి ణాఫ్రికాకు వెళ్లిన తర్వాత అచట తెల్లదొరలు పారతంత్ర్యంలో ఉన్న వారి యెడల ముఖ్యంగా నల్లవారైన భారతీయులయెడ చూపుతూ వచ్చిన నిరాదరణమూ చేస్తూ ఉండిన అవమానాలు ఆయన స్వాతం త్ర్యేచ్ఛను మరింత తీవ్రింప జేసినాయి. శ్వేతజాతులు భారతీయులను హీనంగా చూడటానికి కారణం పారతంత్ర్యమేనని ఆయన నిశ్చయించు కున్నాడు. ఈ విషయం తలంచుకొన్న కొలదీ ఆయన అవమానంతో క్రుంగిపోయి భారత దాస్యవిమోచనం గావించవలెనని కృతనిశ్చయు

డైనాడు. మునుముందు దక్షిణాఫ్రికాలో భారతీయులను తెల్లదొరలు పెట్టుతున్న కడగండ్లు తొలగించడానికి పూనుకున్నాడు. ఇదే మహాత్ముని అహింసాపూర్వక శాంతి సమరానికీ సాత్వికనిరోధానికీ సత్యాగ్రహానికీ అంకురార్పణ. మహాత్ముని ధిక్కార యత్నాలకు కుపితులై తెల్లదొరలు ఆయనను ఎన్నెన్నో కష్టాలకూ, అవమానాలకూ పాలు చేశారు. కాని మహాత్మాగాంధీ వానికి జంకలేదు. వారికి లొంగనూలేదు. తుదకు ఆయనతో ఒడంబడిక చేసుకోక తెల్లవారికి తప్పనూలేదు. మహాత్మునకు దక్షిణాఫ్రికానుండి భారతదేశం వచ్చినతర్వాత మాతృదాస్య విచ్ఛేదనకు పూనుకున్నాడు. 1920 సంవత్సరం కలకత్తాలోజరిగిన అవసర కాంగ్రెసు సభలో సహాయనిరాకరణం అంగీకరింపబడ్డది. 1921 సంవత్సరం బెజవాడలో జరిగిన కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గసభలో కోటిమంది సభ్యులు, కోటి రూపాయలు, 20 లక్షల రాట్నాలు అనే నిర్మాణాత్మకమైన కార్యక్రమం ఆరంభమైంది. సత్యాహింసలు, హిందూ మహమ్మదీయైక్యత, అస్పృశ్యతా నివారణ మూలసూత్రాలుగా చేయబడినాయి. పాఠశాలలు, న్యాయస్థానాలు శాసన సభలు, విదేశవస్త్రములు బహిష్కరించవలెననీ, మద్యపానం నిషేధించవలెననీ ఉద్బోధింపబడ్డది. తోడ్తో, జాతీయ పాఠశాలలు నెలకొల్పుట, పంచాయతీకోర్టులు స్థాపించుట ఖద్దరుత్పత్తిచేయుట ఆదిగాగల ప్రతి విధానాలుగూడా అవలంబింప బడినాయి. ఈ మహోద్యమమంతా అహింసాత్మకంగా జరుగవలె ననేదే మూలసూత్రం.

ఈ మహోద్యమం భారతీయులలో అఖండ ప్రబోధం కలిగించింది. మహాత్ముని అడుగుజాడలలో నడవటానికి స్త్రీ పురుష వివక్షతలేకుండా ఆబాలవృద్ధులు బయలుదేరారు. శాసన ధిక్కారాలు శరిపాటైనాయి. పికిటింగులు నిత్యకృత్యమైనాయి. ఊరేగింపులు జరపడము సభలు చేయడము, జైళ్లకు వెళ్లడము సర్వసాధారణమైంది. అహింసాత్మకమైన యీ మహాసమరంగాంచి బ్రిటిషు ప్రభుత్వం గజగజలాడిపోయి ఏమీ తోచక వేడురెత్తినటులై సర్వశక్తులూ కేంద్రీకరించి

బలప్రయోగం చేసింది. కొట్టినవానిని కొట్టడమూ ఎదిరించినవాడిని యెదిరించడమూ, చంపినవాడిని చంపడమూ తేలికకాని ప్రతిక్రియా విరహితులైన ప్రజానీకంపై బలప్రయోగం చేయడం ఎల్లా? ప్రభుత్వంవారికి వచ్చిన చిక్కేదే. అయినా అధికారదర్పితులై కఠిన చిత్తతతో దమననీతి అవలంబించారు. కాని ఉద్యమం చావలేదు. నిరాకరణోద్యమంకంటె లవణ సత్యాగ్రహోద్యమమూ లవణసత్యాగ్రహోద్యమంకంటె క్విట్ యిండియా ఉద్యమమూ, ఒకదానికంటె ఒకటి బలవత్తరమై సహస్రముఖాలుగా విజృంభించింది. ఇక బలప్రయోగంచేత భారతీయుల స్వాతంత్ర్యేచ్ఛ నరికట్టడం దుర్లభమని బ్రిటిషువారు గ్రహించారు. రాయబారాలనేకం సాగిన పిమ్మట భారత దేశానికి స్వాతంత్ర్యం యివ్వడానికి బ్రిటీషు ప్రభుత్వం నిశ్చయించింది. మహాత్ముని సంకల్పం ఫలించింది. హిందూ మహమ్మదీయైక్యత అనేసూత్రం మహాత్ముని ప్రథమ స్వరాజ్య ప్రణాళికలోనే ఉన్నా బ్రిటిషు ప్రభుత్వంవారు స్వార్థపరత్వంతో కల్పించిన విభేదాలవల్ల ముస్లిములు క్రమక్రమంగా ప్రత్యేక ప్రాతినిధ్యాలూ, ప్రత్యేక సౌకర్యాలు ఆకాంక్షించడంతో ఆరంభమై ప్రత్యేక రాజ్యభాగం కోరేవరకూ వచ్చింది. ఈ విభేదకల్పనకు ప్రధాన నాయకుడు మహమ్మదాలీ జిన్నా. వీరి సంస్థ ముస్లింలీగు. మత ప్రాధాన్యతతో కాంగ్రెసును ఎదుర్కోడమే యీలీగుపని. మహాత్ముని స్వరాజ్యోద్యమం జాతిమత విభేదాలకు అతీతమైనది. అందులో మత ప్రశంసలేదు. భారత దేశాన జన్మించిన వారంతా భారతీయులే, భారతీయులైన వారందరూ స్వరాజ్యాని కర్హులే, అనేదే ఆయన నిర్వచనం. అయినా భేదకల్పన చేయబడ్డది. కనుక 1947 సంవత్సరం ఆగస్టు 15 తేదీని భారతదేశానికి స్వాతంత్ర్య ప్రసాదింపబడినప్పుడు ముస్లిములు అధిక సంఖ్యాకులుగాఉన్న భాగం విడదీయబడి పాకిస్థాన్ అనే పేరుతో ప్రత్యేక రాజ్యం చేయబడ్డది. మిగిలిన భాగం యిండియన్ యూనియన్ అనేపేరుతో ప్రత్యేక రాజ్యంగా ఏర్పడ్డది. అఖండ భారత వర్షాన్ని ఐక్యభారత వర్షాన్ని ఆశించిన మహాత్మాగాంధీజీకి యీ విభజన యెంతో మనఃఖేదం

కలిగించింది. పైగా విభజనానంతరమైనా ఉభయరాజ్యాలవారు సుఖంగా ఉండక పరస్పర ద్వేషంతో సాగించిన మతకలహాలు, ఆస్తి దోపిళ్లు, గృహదహనాలు స్త్రీజనాపహరణాలు భంగపాట్లు ఆయనకు ప్రబల దుఃఖకారణాలైనాయి. ఇట్టి అకృత్యాలు తగవనీ, విభజన ఎట్లాగో జరిగింది గనుక యికనుంచైనా నెమ్మదిగా ఉండి ఎవరి రాజ్య భాగం వారు అభివృద్ధిలోకి తెచ్చుకోవలసిందనీ, ఎవరిరాజ్యంలో గల అల్పసంఖ్యాకులను వారు ప్రేమతో ఆదరించవలసిందనీ మహాత్ముడు ఎన్నోవిధాల ఉభయరాజ్యాల వారికి చెప్పాడు. ధర్మనుయమైన ఈ హితోక్తులు నచ్చకపోగా యిరుతెగలలోను మతోద్రేకులైన వారికి మహాత్ముడు అహితుడైనాడు. హిందువులను అభిమానిస్తున్నాడనీ మహమ్మదీయులూ, మహమ్మదీయుల నభిమానిస్తున్నాడని హిందువులూ ఆయనపై నేరమారోపించారు. మనం యిండియన్ యూని యన్‌లో గల ముస్లిముల నెప్పుడు ఆదరిస్తామో అప్పుడు పాకిస్తానులో ఉండే హైందవుల రక్షించే బాధ్యత వారిపై పడగలదనీ, అట్లావారు చేయకపోయినచో మనంవారిని గట్టిగా అడుగుటకు వీలవుతుందనీ మహాత్ముని తలంపు. కాని మహాత్ముని ఋజువర్తనమూ, ధర్మవాద మూ సంకుచిత హృదయులకు అర్థంకాలేదు. ముఖ్యంగా మహా త్ముడు మరణానికి కొన్నిదినములకు ముందు ప్రాయోపవేశం చేసి నప్పుడు దానిని విరమించడానికి కోరిన షరతులు అధికంగా మహమ్మ దీయులకే అనుకూలించేవిగా కన్పించినందున హిందూమత పక్షపాతు లకు మహాత్మునిపై ఆగ్రహం అధికమైంది. ఆకారణంవల్ల 1948 సంవ త్సరం జనవరి 30 తేదీ శుక్రవారం సాయంత్రం అయిదుగంటలవేళ మహాత్ముడు ప్రార్థన సమావేశానికి వస్తూ ఉండగా (నాథూరామ్ వినాయక్ గోడ్సే అనేమహారాష్ట్రుడు) ఆయనను రివాల్వరుతో కాల్చి చంపివేశాడు. మహాత్ముని హత్యాస్మరణ వార్త విని భారతీయులేగాదు సర్వప్రపంచ వాసులు దుఃఖవిహ్వలులైపోయినారు. మహాత్ముడు తన సత్యనిష్ఠచేతను అహింసాపరత్వంచేతను ప్రేమ స్వభావంచేతను, సర్వ సమత్వంచేతను శమదమాదులచేతను విశ్వగురుత్వం అందుకొన్నాడు.

కనుక అట్టి మహనీయుని కోల్పోవడం ఎల్ల ప్రపంచవాసులకు ఆత్మీయుని కోల్పోయినంత దుఃఖకారణమైంది. 1921 సంవత్సరంలో మహాత్ముడు సహాయనిరాకరణోద్యమం ఆరంభించిన దాది భారత వర్షాభ్యుదయానికి ఆయనచేయని కృషిలేదు. మతసంఘరాజకీయ ఆర్థిక నైతిక పారిశ్రామిక విద్యా విషయాది సమస్త విషయములలో ఆయన అఖండ కృషిచేశాడు. మహాత్ముని మహోద్యమం ఆత్మబల విశిష్టం, సత్యసమన్వితం, అహింసాపూర్వకం. శస్త్రం ధరింపకుండా ధర్మం మీరకుండా స్వరాజ్యం పొందడం ప్రపంచ చరిత్రలో అపూర్వ విషయం. మహాత్మాగాంధీ నాయకత్వాన అట్టి గౌరవం భారతవర్షానికి దక్కింది. మహాత్ముడీ అహింసామార్గంలో దక్షిణాఫ్రికాలోను భారతవర్షంలోను పదునేడు సమరయాత్రలు సాగించాడు. పదునేడు ప్రాయోపవేశాలు చేశాడు. పదునారు పర్యాయములు కారాగృహవాసం చేశాడు. ఈ మహత్తర కార్యకలాపాలవల్లనే ఆయన మహాత్ముడనబడ్డాడు. రాముని శీలము, కృష్ణుని రాజ్యకార్య దురంధరత్వము బుద్ధుని అహింసానిరతి ఆయనలో మూర్తీభవించినవి. ఏసుక్రీస్తు ప్రేమతత్వము మహమ్మదు సౌభ్రాతృత్వము, టాలుస్టాయి నీతి నిరతి ఆయనలో ప్రతిఫలించినాయి. ప్రాచీనమహర్షుల ఆశ్రమ జీవనానికి ఆయన తార్కాణమై వరలినాడు.

నేను నూటయిరువదేండ్లు బ్రతుకుతానని మహాత్ముడు మాటిమాటికీ పలుకుతూవచ్చాడు. కాని ఆవిధంగా జీవించకుండా చేజేతుల చంపుకున్న మన అభాగ్యం ఏమనుకోవాలె?

భారతస్త్రీలకు మహాత్ముడు చేసిన ఉపకారం అసదృశం. నిరాకరణోద్యమం ఆరంభించగానే పురుషులతో బాటు స్త్రీలుగూడ అందు చేరవలెనని ఉద్బోధించాడు. కాంగ్రెసు సంఘాలలో స్త్రీలకుగూడ ప్రాతినిధ్యం కల్పించాడు. మాతా కస్తూరిబాయిపేర కోటి యిరవై లక్షల రూపాయల నిధి పోగుచేసి గ్రామస్త్రీల యుద్ధరణకు వినియోగింపజేశాడు. స్వరాజ్య ప్రభుత్వం ఏర్పడగానే స్త్రీలకుగూడ గవర్నరు పదవులు, మంత్రిపదవులు, విదేశ రాయబారపు పదవులు యిచ్చునట్లు

చేశాడు. ప్రథమ భారత ప్రభుత్వాధ్యక్షుపదవి ఒక స్త్రీ ముఖ్యంగా తా నత్యంతము అభ్యుదయం కోరే ఒక హరిజన యువతి కావలెనని కోరాడు. ఉత్తరఇండియాలో యిటీవలజరిగిన మతకలహాలలో బలత్కార భంగపాటులకు మతాంతరీకరణములకు, అపహరణలకు పాలైన స్త్రీలను సంఘంలో చేర్చుకోవలసిందనీ నిరపరాధినులైన ఆ స్త్రీలు దయనీయులని పల్కాడు. గర్భవతులైన స్త్రీలనుగూడా చెడెపలని నిరాదరింపవలదని కరుణబుట్ట చెప్పాడు. అపహృత బాలికలను వివాహమాడుటకు పూనుకొనండని యువకులను హెచ్చరించాడు. హిందూసంఘంలో వేశ్యలనే వారుండుటకు ఎంతోనొచ్చుకొని వారెల్లరు వివాహము చేసుకొని గౌరవంగా జీవించాలని హెచ్చరించాడు. దయార్ద్రహృదయుడైన మహాత్ముడు అబలా జనోద్ధరణకై చేసిన కృషి యెంతైనా ఉన్నది. ఇటువంటి మహిళాబాంధవుడు అస్తమించడంచేత పూవప్రాయంలోవున్న భారత మహిళోద్యమానికి గూడా హానికల్గిందని చెప్పవచ్చును. స్థలాంతరమున ప్రచురింపబడిన మహాత్ముని స్వరాజ్య ప్రణాళికలోని మహిళోద్ధరణ సూత్రం చూచినట్లైతే మహాత్ముడు స్త్రీలవిషయంలో ఎంత ఉదారుడైనదీ, విదితం కాగలదు. కాని ఎంతవిచారించినా ఆయన యిక మనకు లేడు, రాడు. అజరామరమైన ఆయన హితోపదేశాలు మనం చిత్తశుద్ధితో అనుష్ఠించడమే ఆయనయెడ మనం చూపగల భక్తికి నిదర్శనం. పూజ్య బాపూజీకి నమస్కృతులు.

రఘుపతి రాఘవ రాజారాం
పతిత పావన సీతారాం
ఈశ్వరాల్లా తేరేనాం
సబ్‌కో సన్మతి దే భగవాన్.



## మహాత్మాగాంధీ చతుర్వింశతి.

అతడు దేవుడు భారతీయాళికెల్ల
సంఘ మత రాజకీయాది సకల కార్య
వితతినెల్లను నతనికి విడిచిపెట్టి
భారతీయులు కొల్చిరి భక్తినతని. ౧

అతడు ప్రభువు, చెల్లె నతనియాజ్ఞ నిఖిల
జగతి శాసనముపగిది సర్వముగను
సార్వభౌముల శాసన సమితికైన
నడ్డుగలదేమొ కాని లేదతని నుడికి. ౨

అతడు జ్ఞాని, యిల సుఖదుఃఖాది ద్వంద్వ
ములకు లేశమైన నతడు కలగడయ్యొ
నెంత యొరపిడిపెట్టిన నేమియైన
కనియు కనకుండె వానిని కచ్చితముగ. ౩

అతడు భక్తుడు తనకార్య వితతినెల్ల
భగవదర్పితముగ జేసి బాధలేక
సఫలమైనను మరియది విఫలమైన
నీశ్వరేచ్ఛయే యని మది నెంచుచుండె. ౪

అతడు భూసురుడే నిజం బరమరేల
దయయు సత్యంబు శౌచంబు తపము విద్య
బ్రహ్మచర్యంబు నాదియౌ బహుళ దివ్య
బ్రాహ్మణోచిత గుణముల వరలెగాన. ౫

అతడు సుక్షత్రియుడు ధీరు డాహవమున
కేల శస్త్రంబుపట్టక కీర్తనీయ
శాంతిసమరాన శాత్రవ సమితిగెల్చి
విజయలక్ష్మిని గైకొని విభవ మెసగ. ౬

అతడు కోమటి పుట్టుకయందు నిజము
మూలపడియున్న రాటాన నూలువడకి
కాను వీసంబు పోనీక ఖద్ద రమ్మి
దేశమున కర్థలాభంపు తెఱువుసూపె. ౭

అతడు శూద్రుడు వ్యవసాయి యనవరతము
సేవజేయుచు యాతని జీవితార్థ
మతనిసేవను భారతీయాళిగాదు
పూతమయ్యెను మానవజాతియెల్ల. ౮

అతడు ఛండాలు డిచ్చచే నాదినుండి
యగ్రజాతుల రాయిడి నహరహంబు
పొందరానట్టి బాధల బొందుచున్న
పంచములగావ ప్రాణమే పణముబెట్టె. ౯

అతడు ధనికుడు, లేమి లేదతని కెపుడు
కావలయు సొమ్మనిన జాలు కాళ్లముందు
కుమ్మరిల్లెను రూకలు కోట్లకొలది
దేశహితముల వానితో దీర్చెనతడు. ౧౦

అతడు పేదలలో పేద యరసిచూడ
భోగభాగ్యంబు లాతడు పొందడయ్యె
కుఱుచ కొల్లాయిగట్టును గుడిసెనుండె
ఆకలిని దీర్పగా త్రాగె మేకపాలు. ౧౧

అతడు కఠినుడు సందియ మందనేల,
నియమ పాలనమున సదా నిశ్చయముగ
తాను తనవారు తనశిష్యతతిని నెందు
నియతి మీఱిన నిష్కృతి నెఱి విధించె. ౧౨

అతడు సదయుడు, నవనీత మతని మనసు
కరగె పేదల కష్టంపు కథలువినిన

పేదనారాయణు లనుచు పేరుబెట్టి
కొలిచె వారిని సతతంబు కూర్మితోడ. ౧౩

అతడు నీతిరతుడు కాన నఖిలకార్య
వితతియందును నాతని విపులనీతి
సూత్రమై కానుపించెను చొచ్చిచూడ
పూలసరమున దారంబు పొసగినట్లు. ౧౪

అత డహింసావ్రతుడు గాన ననవరతము
పాలనము సేయుచుండె నాపరమవ్రతము
చీమకైనను గోరడుచెఱుపు నతడు
అఖిలజీవంబు లాతనికాత్మ సమము. ౧౫

అతడు సత్యము సత్యమే యతనిరూపు
మునను నవతరించెనుగాన ననిశ మతడు
ప్రాణములు వీడ సమ్మతి పడెనుగాని
సత్యపథమును మీఱంగ జాలడయ్యె ౧౬

అతడు ధర్మముకావున నవని తనదు
సర్వకార్యంబులను ధర్మసరణి నడిపె
నెంతలాభంబు రానున్న నేమియైన
ధర్మవిరహిత మాదాని తలపడయ్యె. ౧౭

అతడు ప్రేమమయుడు నిజంబవని నెందు
పగతులనువారి కాన మప్పరమ ఋషికి
రాల రువ్వినవారిని పూలరువ్వ
చెంపపైగొట్ట రెండవ చెంపజూపె. ౧౮

ఆత డేకేశ్వరోపాసి, యాస్తికుండు
భక్తిభరితాంత రంగుండు పావనుండు

ప్రార్థనలు చేసి వేలాది ప్రజలకూర్చి
వేయి పను లున్న సాయాహ్న వేళలందు. ౧౯

అతడు రాముడు నామ విఖ్యాతియందు
రామనామము నేరీతి రాజ్య మేలు
భారతీయ హృదయరాజ్య భాగములను
క్రాలు నారీతి నిప్పు డా ఘనుని పేరు. ౨౦

అతడు విశ్వగురు డతనియమలవాణి
విశ్వమానవ హితదమై వెలసెగాన
దేశదేశాల నాతని దివ్యసూక్తు
లతులభక్తిని స్మరియింతు రఖిలజనులు. ౨౧

అతడు నిత్యోపవాసియగా నరయ నిజము
మంచి రుచిపాకముల యెడ మమత లేక
అసువు నిలుపంగజాలెడి యంతమాత్ర
కటికిరొట్టెతో కాలంబు గడపెగాన. ౨౨

అతడు దేశము దేశమే యతడుగాన
దేశదాస్యంబు దీర్పంగ దీక్షబూని
సిలుగులకు నోర్చి యెంతయో సేవజేసి
తుదిని నందుకే ప్రాణంబు వొదలిపెట్టె. ౨౩

అతడు మహనీయగుణుడు మహాత్మగాంధి
భారతాంబ నోములపంట భవ్యమూర్తి
పుత్తలీబాయి కొమరుండు పుణ్యమూర్తి
పోరుబందరు పురమున బుట్టె నతడు. ౨౪

( కనుపర్తి వరలక్ష్మమ్మ )

# బాపూజీ

అవి గవిగో
ధగధగ మెరసే
తారలలోపలి
వెలుగులో వెలుగై
గాంధీ యున్నాడూ.

తళతళలాడే
మిలమిల మెరసే
చిన్నిపాపలా
కనుపాపల్లో
గాంధీ యున్నాడూ.

ఆవురావురని
అరచుచు నుండే
బక్కచిక్కినా
పేదల తనువులో
గాంధీ యున్నాడూ.

చిటపటమంచును
ఛెలగుచు మండే
త్యాగధనుల చితి
మంటల వెలుగులో
గాంధీ యున్నాడూ.

మానప్రాణములు
బలిమిని బాసీ
మ్లాన వదనలై
క్రుంగుచు నుండిన
భారతమాత భామల
మానస వీధిలో
గాంధీ యున్నాడూ.

మతము పేరిడీ
మనసు చంపుకొని
పిన్న పెద్దల తన్ని చంపినా
తురకల తలలో
గాంధీ యున్నాడూ.

ఛీపో దూరము
ముట్టగూడదనే
మాలమాదిగల
మనుజుల హ్రాదిలో
గాంధీ యున్నాడూ.

మరణించాడే
గాంధీ బాబని
బొటబొటకన్నీ
రోడ్చుబోకుడి
గాంధీ యున్నాడూ.

దేశ సేవకై
చీము నెత్తురూ
ధార పోసెడీ
త్యాగుల మదిలో
గాంధీ యున్నాడూ.

అమరజీవి యువ
తారపురుషుడూ
అతనికి మృత్యువు
లేదని నమ్మెడు
గాంధీ యున్నాడూ.

బ్రతికి యుండగా
ఒక్కడెగాంధీ
మృతిని బొందగా
అందరు అతడై
గాంధీ యున్నాడూ.

అశుభము శుభంబును
అన్యంబెరుగక
పుట్టబోయెడి
బాలల అంశలో
గాంధీ యున్నాడూ.

ఇందు గలడు
అందు లేడనీ
ఎంచబోకుడీ
వెఱ్ఱిగ నెవరూ
అంతట తానై
గాంధీ యున్నాడూ.

ఇమ్మానేని లీలాదేవి.



# అశ్రు తర్పణము.

* ★ *

అల్లదే భారతాకాశ మందు వెల్గు
భాను డస్తంగతుండయ్యె పశ్చిమాబ్ధి
తెరలి దుఃఖంబు వ్యాపించె దిక్కులందు
పర్బ్బికొనియె చీకట్లు నభంబునెల్ల. ౧

భారత జాతినెల్ల నడుపందగు సారథియై నియంతయై
పూరుషమూర్తి దాల్చిన సమున్నత దైవమెయై మహాత్ముడై
భారతదేశకీర్తిని ప్రపంచమునించిన నాయకుండునై
కారణజన్ముడై మసిన గాంధి పడెఁ కట క్రూరహంతచే. ౨

భారత మాతృ గర్భమణి పండినపండు తపోధనుండు ప్రే
మా రమణీయ విగ్రహుడు, మానవకోటికి నొజ్జబంతి, స
ద్ధీరుడు శాంతిసత్యగుణ ధీమణి సర్వసముండు సత్కృపా
సారు డహింసయే పెనుచు సాధువు గాంధి వసుంధరాస్థలిన్. ౩

ధన దేవతారాధనను ముందు తొలగించి
దేశ సేవాసక్తి తెలిపినాడు
అన్నాతురులయార్తి నపనయింపగ జేయ
చేరాటములు త్రిప్ప జేసినాడు
సంఘదోషంబుల సమయింప సమకట్టి
అంటరానితనము నణచినాడు
బీదసాదల దైన్యవేదన విదళింప
మధుపాన సేవను మాన్పినాడు

లోకహితకారి యధికార లోక వైరి
రమ్యసత్యవ్రతాచారి రాట్నధారి

కర్మయోగి మహోద్ధామ ధర్మశీలు
ఖలుడ! చేయెట్లువచ్చెరా! కాల్చనీకు. ౮

పగవారయ్యును నాంగ్లపౌరజనముల్ ప్రహ్లాదసంకాశునీ
సుగుణోపేతు మహాత్మగాంధి సమునిన్ జూడంగ లేదంచు వే
బొగడంజొచ్చిరి గద్యపద్యముల సొంపుల్గుల్క భావంబులన్
భగవత్సౌమ్యుడు నేసు తుల్యుడనుచున్ భావించి సద్భక్తిమై. ౯

———o———

## అస్తి నిమజ్జనము - కృష్ణావాహినీ పావనీ

—•• ••—

పరమప్రేమ నిధానుడై విపుల విశ్వవ్రాత సంపూజ్యుడై
తరణోపాయ విధాన కార్యరతుడై తత్వార్థ నిర్ణేతయై
దురితత్మ్యాజన పంకశుద్ధికరుడౌ ధుర్యుండు శ్రీ గాంధిజీ
నరదేహాస్తిక దాల్చు భాగ్యవతి కృష్ణావాహినీ పావనీ.

శ్లోకం॥ దేశస్వాతంత్ర్య మంత్రం ప్రవిమల సుమన సంఘ సంభావ్యమంత్రం
స్వార్థత్యాగాభి మంత్రం సకల జనమనోత్సాహ సంధాన మంత్రం
లోకైక త్రాణ మంత్రం పశుబల హననోద్యోగ సంభూత మంత్రం
బోధావిఖ్యాత మంత్రం జపతప బహుధా శాంతిమద్గాంధిమంత్రం.

దేశరాజు భారతీదేవి.



19

# ఒట్టు పెట్టేశా.



మహాత్మాగాంధీ మరణించాడని
అమ్మా నాన్నా-అయ్యోఅనగా
నాకుదుఃఖము – ఆగకపోయె
మూలకపోయి - మొర్రోఅంటీ
అమ్మ పరుగునా – వచ్చిపట్టుకొని
ఏడువబోకూ – ఆషారాణీ
మహాత్మగాంధీ – మరిపోలేదూ
మన మనసుల్లో - మన ఆత్మల్లో
మహాత్మగాంధి – మసలుతు ఉంటే
పరులకు కీడు – పనిచేయకుమీ
తురకలు మన మొక తల్లిబిడ్డలం
మాలలుగూడా మనవాళ్లేనూ
అహింసలోనే – అన్నీ ఉన్నవి
సత్యమెప్పుడూ–చెప్పుచుండుమూ
శాంతమె నీకు - సహజభూషణం
ఈ మాటలు నీ – వెప్పుడుగానీ
మఱువకుంటివా - మహాత్మగాంధీ
నీదగ్గరనే ఉం – టున్నాడనుకో
అని మాఅమ్మా–అన్నమాటలూ
వినినేనప్పుడు - వీడియేడ్పునూ
మహాత్మగాంధీ – మంచిమాటలూ
మరువక చేసీ – మచ్చుచూపెదనీ
అమ్మదగ్గిరా – నెమ్మదిగానూ
ఒట్టుబెట్టితి - గాంధీసాక్షిగా.

ఇమ్మానేని ఆషారాణి.

# బాష్పాంజలి



అకటా యెంతటి దుఃఖవార్త వినగా నయ్యెన్ మహాత్మున్ ఘనున్
సకలోర్వీజన పూజ్యమానుఁ సుజనున్ సంపూజ్య చారిత్రునిన్
ఒకమూర్ఖుం డెవఁడో తుపాకిగొని కోపోద్రిక్త చిత్తంబునన్
వికలుండై వడికాల్చివైచె నటు హా పీడన్ వెసన్ జీవమ్మున్. ౧

మెత్తనివాని నెప్డు మన మేలునె కోరెడువాని సర్వదా
చిత్తమునందునైన పరచెట్టనుకోరని వాని గాంధి లో
కోత్తర పూరుషున్ సుతపు గొంకక జంకక జాలిమాలి చే
యెత్తి నమస్కరింప జని నెవ్విధి కాల్చితివోయి మూర్ఖుడా!

మన దేవుఁడు మన యేలిక
మన జనకుఁడు గురుఁడు హితుఁడు మాన్యుఁడు జగతిన్
మన గాంధిమహాత్ముఁ డకట
మనలను విడనాడి చనియె మనపాపమునన్.

మన భారతి ప్రియ తనయుఁడు
మనజాతికి జీవగఱ్ఱ మననేత యహో
మనపాలి కల్పవృక్షము
మనలను విడనాడి వెడలె మనుటెట్లా యికన్.

ప్రాణగొడ్డంబైన బన్నంబు వచ్చిన
ధర్మంబు మీరని ధర్మమూర్తి
దేశకార్యము లెన్ని తీర్చుచు నుండిన
సత్యంబు వీడని సత్యవాది
అహితాత్ము లెంతెంత యారడి బెట్టిన
సహనంబు బాయని సాధుతముఁడు

హింసాపరాయణు లెంత హింసించిన
ప్రతిహింస కోరని యతిదయాబ్ధి

పేద సాదల పాలిటి ప్రేమమూర్తి
మధుర వాక్కుల జనముల మనుచు ఘనుడు
అతుల సేవాప్రియుడు పూజ్యు డమృతమూర్తి
మనమహాత్ముండు లేడుగా మనకు నేడు ! ౫

స్త్రీ పురుష విభేద సేతలు తగ వని
సమతత్వ బోధలు సలిపినాడు
ఉన్నతోద్యోగము లువిదల కిప్పించి
స్త్రీ జనబంధువై చెలగినాడు
చెనటుల చే జిక్కి చెడినట్టి స్త్రీలను
కనికరంబున జూచి కాచినాడు
నిరపరాధలు వ్రాసు నిందింప బోలరు
చేర దీయుడటంచు చెప్పినాడు

కోటి యిర్వది లక్షల గొప్పధనము
మాత కస్తూరి పేరిట మనకు గూర్చి
గ్రామ స్త్రీలను బ్రోవంగ గడగినాడు
మనమహాత్ముని మహిళలు మఱవ వశమె. ౬

అన్నమో రామయని పేద లలమటింప
కూడు గుడ్డకు కంట్రోలు కూడదనుచు
దొరతనంబున వాదాడి తొలగజేసి
పిడికె డన్నంబు పేదకు బెట్టిపోయె
నరుడె మనగాంధి దేవతావరుడు గాక. ౭

సతత ముపవాస వ్రత శీలి సాధుతముడు
సకలలౌకిక దేశిక చక్రవర్తి
భారతీయ హృద్గగన ప్రభాకరుండు
అస్తమించెను చీకటు లలమ జగతి. ౮

అమ్మహాత్ముని బోధల నాదరించి
అమ్మహాత్ముని వర్తన ననుసరించి
అమ్మహాత్ముని నుపకృతి నాత్మదలచి
ధన్యతను గాంచుటే యింకె దారి మనకు. ౯

కనుపర్తి వరలక్ష్మమ్మ.



# Mahatmaji.

*Praise him - Bharatvarsh - Praise him !*
*Glorify ! Mighty nation ! Glorify !*
*Adore ! Indraprastha ! Adore !*
*Our Mahatmaji - Mighty Soul !*

*Apostle of non-violence - Supreme Saint !*
*An unique phenomenon - A Beacon Light !*
*Purest Being - most elevating - most inspiring ! ,*
*Mohandas Karamchand Gandhiji - Prophet !*

*Hark ! The nation's Sun has set ...*
*Behold ! His Radiant Soul is eclipsed . .*
*Amidst the evil rays of ' Dragon's Head ' - the -*
*Ballet of a nation's dark-minded ' Fury ' !*

*Bereave not ! - Mighty nation ! Bereave not !*
*The Congress is perturbed ! ...*
*Mourn not - Bereaved India - Mourn not !*
*Lo ! His radiant Soul is rising ...*

*Of what avail be our faith - loyalty,*
*Heirs of his great Ideals ! - Spiritual descendants !*
*Believe not all is lost with material body,*
*Follow in his foot-steps - Spread his message !*

*Ho ! Ye-living symbols of Gandhian Heritage :*
*Soldiers of non-violence - carry his banner,*
*Start the Campaign - Amidst this -*
*Embattled Enigma - Conquer by Spiritual Sword !*

*Hush ! There comes his silent figure -*
*In deep meditation absorbed -*
*Sing ! Heavenly muse ! Sing !*
*Sing his praise ! Sing his glory !*

**Kotumraju Sarasavani Devi.**

## ప్రగాఢవగపు - ఊరట !

తల్లీ ! భారత జననీ !......

నీ ప్రతిష్ఠ యతి పురాతనము ! నీ కీర్తి మహోన్నతము ! నీ యశస్సు యతి విస్తృతము ! నీ విజ్ఞత సుప్రసిద్ధము ! జగద్వందితమైన నీ సుకీర్తికి నేడెట్టి కళంక మాపాదిల్లినది ! మహా మహిమా సమన్వితు లగు తపోధను లుద్భవించిన నీగర్భమున, అవతారపురుషు లుదయించిన నీగర్భమున మహాపతివ్రతామతల్లు లుదయించిన నీగర్భమున, సమదర్శు లుదయించిన నీగర్భమున, త్యాగమూర్తులు, సేవావ్రతులు, దయాకలితాంతరంగు లుదయించిన నీగర్భమున నేటి కెట్టి ముష్కరుడు ఎట్టి కర్కశ హృదయుడు ఎట్టి మతోన్మాది యుదయించినాడు ! అనుపమయోగిని అసమాన ప్రేమానురాగిని యసదృశ త్యాగిని, యనవరత రామనామజప రతుని యఖిల ప్రపంచమును తన దెస కాకర్షించుకొనిన యహింసాయోగిని హత్యచేసిన మతోన్మాది గూడ నీగర్భ సంజాతుడే యగుట తల్లీ! నీ కెంత దుఃఖకరము! మా కెంత యవమాన కరము ! లోకమున కెంత యేవగింపు ! అయినను తల్లీ- ఒక ఊరడింపు. తల్లీ ! నీగర్భము మహాత్ములకు పంటపొలము. అయినను వా రేరి ? పుట్టినవారికి గిట్టుట తప్పదు. కారణజన్ములు చిరకాలము మన పనిలేదు. జరావ్యాధిపీడితులై సామాన్యు లట్లు మరణించుట వారి యాచారముగాదు. జీవితమువలె మృత్యువును కారణసహితమై యుండు టయే మహాత్ముల విశిష్టత ! వారికి మృతిలేదు. మహాత్ములు భౌతికమైన శరీరమును విసర్జించుట 'వాసాంసి జీర్ణానియథావిహాయ' అను గీతాసూక్తికి వ్యాఖ్యానమే.

పాంచభౌతికమైన కాయమునుండి విముక్తుడైనంతమాత్రమున రాముడు లేడయ్యెనా? కృష్ణు డెడమయ్యెనా? మహర్షులు దూరమైరా! అట్లే మహాత్ముడును దవ్వు కాలేదు. అతడు అమరుడు. అతనికి మృత్యువు లేదు. మృత్యువునుండి యమృత ధామమునకు గమించినాడు. అంతే ! అతని పవిత్రజీవితము ఎంతకాలము మానవ స్మృతిపథమున నుండునో, ఎంతకాలము ఆయన హితబోధలు మానవజగతికి ఆదర్శప్రాయములై యుండునో అంతకాలము ఆయన యమృతుడే! భారతాంబా! అదియే నీకు ఊరట! మాకు ఊరట! నమోస్తు.

కీ॥ శ్రీ వరలక్ష్మమ్మ

---

# భారత జాతీయ గీతము

## భారత భాగ్యవిధాతా

జన గణ మన అధినాయక జయహే భారత భాగ్యవిధాతా।
పంజాబ సింధు గుజరాత మరాఠా ద్రావిడ ఉత్కళ వంగ।
వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛల జలధితరంగ।
తవశుభనామే జాగే తవశుభ ఆశిషమాగే
గాహే తవ జయ గాథా

జన గణ మంగళ దాయక జయహే భారత భాగ్యవిధాతా
జయ జయహే జయహే జయజయ జయహే॥
అహరహతవ అహ్వాన ప్రచారిత శునీతవ ఉదారవాణీ
హిందూ బౌద్ధ సిఖ జైన పారసిక ముసల్మాన క్రిస్తానీ
పూరబ పశ్చిమ ఆసే తవ సింహాసన పాసే
ప్రేమ హార హయ గాథా [ జయహే ॥

జన గణ ఐక్య విధాయక జయహే భారత భాగ్యవిధాతా
పతన అభ్యుదయ బంధుర పంథాయుగయుగ ధావితయాత్రీ
తుమి చిర సారథి తవరథ చక్రే ముఖరిత పథ దినరాత్రి
దారుణ విప్లవ మాఝే తవ శంఖధ్వనిబాజే సంకట
జనగణపథపరిచాయక జయహే
దుఃఖత్రాతా భారత భాగ్యవిధాతా జయహే ॥

ఘోర తిమిర ఘన నిబిడ నిశీథే పీడిత మూర్ఛిత దేశే
జాగ్రత ఛిలతవ అవిచల మంగళ నతనయనే అనిమేషే
దుఃస్వప్నే ఆతంకే రక్షాకరిలే అంకే
స్నేహమయీతుమి మాతా
జగణ దుఃఖత్రాయక జయహే భారత
భాగ్యవిధాతా జయహే ॥

రాత్రి ప్రభాతిల ఉదిలరవిచ్ఛవి పూర్వ ఉదయగిరి భాలే
గాహే హంగమ పుణ్యసమీరణ సజీవన రసఢాలే
తవకరుణారుణ రాగేనిద్రిత భారతజాగే తవచరణేనతమాథా
జయజయజయహే జయ రాజేశ్వర భారత
భాగ్యవిధాతా జయహే ॥

( రవీంద్రనాథ ఠాకూర్ )

# మహాత్మా గాంధీ



జననం :

2-10-1869



మరణం :

30-1-1948